# ఆంధ్రపత్రిక

317037




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 34 No. 332 FRIDAY 26th MARCH 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# "ప్రళయమేఘాల" సృష్టి: నూతన మారణాస్త్రాలలో అమెరికా ముందంజ

## కాశ్మీరుపై చర్చ వచ్చే సోమవారం నాటికి వాయిదా

### సమస్య తిరిగి మొదటికి వచ్చిన ట్లేనా?

లేక్‌సక్సెస్, మార్చి 24: కాశ్మీరుపై భద్రతామండలిలో రేపు జరగవలసిన చర్చ, సోమవారంనాడు సాయంత్రం 7 గం. 30 ని.కు వాయిదా వేయబడింది.

### తిరిగి మొదటికి

లేక్‌సక్సెస్, మార్చి 24: పాకిస్తాన్ ప్రతినిధివర్గం అవలంబిస్తున్న వైఖరినిబట్టి చూడగా, కాశ్మీర్ వ్యవహారం మళ్ళీ మొదటికి వస్తుందేమోనని అనుమానపడవలసి వస్తోంది. కాశ్మీర్ సమస్యపై తిరిగి ప్రతిష్టంభన ఏర్పడవచ్చునని భద్రతామండలి వర్గాలు తీవ్రంగా ఆందోళనపడుతున్నవి. పాకిస్తాన్ ప్రతినిధివర్గానికి తమ ప్రభుత్వం వద్దనుంచి ఇంకా అంతిమ ఉత్తరువులు రాలేదు. మహమ్మదాలీ జిన్నాగారు తూర్పు బెంగాలులో పర్యటిస్తూఉండడంచేత పాకిస్తాన్ ప్రభుత్వానికి ఆయనతో సంప్రదింపులు జరపడానికి ఇంతవరకూ వీలుపడిఉండకపోవచ్చుననీ, అందుచేతనే ఉత్తర్వులు రావడానికి ఆలస్యం జరుగుతున్నదనీ, ఊహించడం అవుతున్నది.

చైనా ప్రతిపాదించిన తీర్మానానికి అంగీకరిస్తే, తాము ఇంతకాలంనుంచి వాదించిందంతా వృధాఅవుతుందనీ, తమ వాదంలో ఏమీ పట్టులేదనీ ఒప్పుకున్నట్లవుతుందని జఫ్రుల్లాఖాన్ అంటున్నాడు.

చైనా తీర్మానంలోఉన్న పెద్ద ప్రతిబంధకాలివి:

(1) కాశ్మీర్‌లో ప్లెబిసైట్ జరిపేటప్పుడు సేనలను ఉంచవచ్చుననడం.

(2) ప్రస్తుత తాత్కాలిక ప్రభుత్వాన్ని ప్లెబిసైట్ జరిపేటప్పుడుకూడా, అధికారంలో ఉండనివ్వడం. అయా దేశాల ప్రతినిధులు చైనా తీర్మానమునకు చాలా అక్కడక్కడ కొన్ని సవరణలు సూచించారు; కాని ఈ రెండు ప్రధాన అంశాలనుమాత్రం ఏ దేశమూ మార్చవలెనని కోరలేదని తెలుస్తున్నది.

కాశ్మీర్ సమస్యమీదనే ఇండియా పాకిస్తానుల భవిష్యత్ సంబంధబాంధవ్యాలు పూర్తిగా ఆధారపడి ఉన్నదనీ, కాబట్టి ఈ సమస్యను జాగ్రత్తగా పరిష్కరించడం అవసరమనీ పాకిస్తాన్ ప్రతినిధులు అంటున్నారు. వారు చెప్పే విషయం ఇరొకటి ఏమంటే, పాకిస్తాన్ ప్రభుత్వం చైనా తీర్మానానికి ఒకవేళ అంగీకరించిన, గిరిజాతులవారు ఆజాద్ ప్రభుత్వమూ ప్లెబిసైట్ విషయమై నమ్మకం కలిగితేనేగాని అస్త్రసన్యాసం చేయక పోవచ్చునుఅని, ప్లెబిసైట్ జరిపేటప్పుడు కాశ్మీర్‌లో భారతీయసేనలను ఉంచడం ఏమంత సంతృప్తికరమైన ఏర్పాటు కాదన్నమాట నిజమేననీ, కాని శాంతిభద్రతల రక్షణకు అంతర్జాతీయసేన ఇంకా నిర్మాణం కాలేదు కాబట్టి, ఇంతకన్న మార్గాంతరం లేదనీ భద్రతామండలి సభ్యులు అనేకమంది అభిప్రాయ పడుతున్నట్లుగా వ్యక్తిగత సంభాషణలవల్ల తేలింది. ఇండియా పాకిస్తాన్ల సైన్యాలను కాశ్మీరులో సంయుక్తంగా శాంతిభద్రతలను రక్షించవలసిందని అడగడంకూడ ఏమీ ఆచరణ సాధ్యమైన ప్రతిపాదనగా కనిపించడంలేదని కొందరు సభ్యులు అభిప్రాయ పడుతున్నారు.

ఇక కాశ్మీర్ సార్వభౌమత్వం విషయం, దీనిమీద ఇండియా తన వైఖరిని లోగడనే విస్పష్టంచేసింది. అయితే ప్లెబిసైట్ నిర్వహణలోమాత్రం భద్రతామండలి యాజమాన్యానికి ఇండియా అంగీకరించింది.

ఎన్. గోపాలస్వామి అయ్యంగారు భారతదేశానికి రావడానికిపూర్వం, కాశ్మీర్ సమస్యపై ఏ అంశాలమీద ప్రతిష్టంభన ఏర్పడిందో ఆ అంశాలిప్పటికీ అపరిష్కృతంగానే నిలిచి ఉన్నవని దీనివల్ల తేలుతోంది.

## వీటిగాలి సోకినచోట ప్రజలు సమూలంగా నాశమవుతారట

న్యూయార్కు, మార్చి 24: రేడియో కిరణాలశక్తితోనిండబడ్డ ఒక రకమైన "ప్రళయమేఘాలను" అమెరికా కనిపెట్టినదనీ, వాటిగాలి ఏ ప్రాంతానికి సోకితే ఆ ప్రాంతంలో ప్రజలందరూ క్షణంమే మరణిస్తారనీ అమెరికన్ విమానాల నిర్మాత గ్లెన్ మార్టిన్ ఈరోజు ఒక ప్రకటన చేస్తున్నాడు.

"పటంబాంబులను ప్రయోగించే విమానంకన్నా ఈ "ప్రళయ మేఘాలు" ఎక్కువప్రాంతానికి కీడు కలిగించగలవు. ఈ మేఘంసోకిన ప్రాంతమంతా చాలా కాలంవరకూ రేడియో శక్తితో నింపబడి మానవులు జీవించటానికి ప్రమాదభరితమై వుంటుంది. ఈ మేఘాన్ని గాలితో వ్యాపింపజేస్తారు. కాబట్టి గాలివాలు ఎదురు తిరిగినంచే, ప్రయోగించిన వాళ్లనే నెత్తి అదుస్తుంది. కాబట్టి దీనిని ఉపయోగించాలంటే గాలిపాటు బాగా తెలుసుకుని వుండాలి.

ఎగిరే బాంబులు. ఒక వస్తువును వెదికి దానిమీదపడి భగ్నం చేసేవిధానాన్ని అమెరికా కనిపెట్టింది. దీనివల్ల వేలమైళ్ల దూరంలో ఉన్న ఏ ఓడనైనా ధ్వంసం చేయవచ్చును. కాని దారిలో పవ ఓడలు లేకుండా చూసుకోవాలి. ఇంకా రోగాలను కలిగించే సూక్ష్మజీవుల బాంబులు మొదలైనవెన్నో వున్నవి. వీటిని ఉపయోగిస్తే 2 నెలలలో యుద్ధం పూర్తిగా తేలిపోతుంది."

## "సంస్థాన కాంగ్రెస్‌లో చీలికలు కల్గించే ప్రయత్నాలేవీ ఫలించవు"

### నిజాం ప్రభుత్వానికి కాంగ్రెస్ ప్రముఖుని హెచ్చరిక

హైదరాబాద్, మార్చి 24: నిజాం సంస్థాన కాంగ్రెసు ప్రముఖులలో ఒక్కరయిన బి రామకృష్ణారావు గారు, సంస్థాన కాంగ్రెసులో విభేదాలను కలిగించటానికి జరుగుతున్న ప్రయత్నాలేమీ ఫలించవనీ, అటువంటి దుష్ప్రచారాన్ని నమ్మవద్దనీ ప్రజలను హెచ్చరిస్తూ ఈ క్రింది విధంగా ప్రకటించారు:

"ఈ మధ్య ఒక స్థానిక దినపత్రిక రాజకీయ విలేఖరి కేవలం అభూత కల్పనలను ఆధారంగా చేసుకుని, ప్రస్తుత రాజకీయ పరిస్థితులు చాలు ఆశాజనకంగా వున్నవనీ, సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడు స్వామి రామానంద తీర్థ గారితోనూ, నాతోనూ నిజాం ప్రధాని సంప్రదింపులు జరుపుతున్నాడనీ, అప్పుడు ప్రధాని ఒక పరిష్కారమార్గాన్ని సూచించాడనీ వ్రాశాడు. ఇంతకన్నా అసత్యమైన అభూత కల్పన వేరే ఉండబోదు. బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన, ఇండియన్ యూనియన్‌లో చేరటం, అనే ప్రధానాంశాలను రెండింటినీ ప్రభుత్వం త్రోసిపుచ్చినప్పుడు సంస్థానంలోని అన్ని పక్షాలూ కలిసి ప్రభుత్వం పాల్గొని, ఇండియన్ యూనియన్‌తో సంప్రదింపులు ప్రారంభించబోతున్నవని అనుకోవటం కేవలం భ్రమమాత్రమే.

స్వామి రామానందతీర్థను బేగంపేట బంగళాకు తీసుకునివచ్చి ప్రధాని చర్చలు జరుపుతున్నాడన్న వార్తలో నిజానిజాలు నాకు తెలియవు. కాని, అది నిజమే అయితే అది స్వామీజీ గౌరవానికీ, నిజాం ప్రధాని, ప్రభుత్వాల గౌరవానికీ చాలా భంగకరం. బయటి పరిస్థితులేమీ స్వామీజీకి తెలియకుండా ఆయన్ను నిర్బంధంలో వుంచి ఎంతమాత్రం ఉచితమైనది కాదు.

ప్రధాని, అటువంటి సామర్థ్యాపని చేస్తారని నేను అనుకోను.

నేను మార్చి 12 వ తేదీన ప్రధానిని కలుసుకున్నప్పుడు, ఆయనతో ఏవో సంప్రదింపులు జరిపానని, అనేకచోట్ల దుష్ప్రచారం చేయబడుతున్నట్లు తెలుస్తున్నది. అప్పుడు ప్రస్తుత రాజకీయపరిస్థితులను చర్చించటానికే ఆక్కడికి వెళ్ళినప్పటికీ, నేను కేవలం వ్యక్తిగతంగానే అందులో పాల్గొన్నాను. ఆ సందర్భంలో ప్రధాని, నాకు రాజకీయ ప్రతిష్టంభనను పరిష్కరించటానికి ప్రభుత్వపు షరతులను తెలియచేశాడనటంలో నిజము లేశ మాత్రంకూడా లేదు. అప్పుడు జరిగినదల్లా, మేమిద్దరమూ ప్రస్తుత ప్రతిష్టంభనను గురించి చర్చించుకొనటంమాత్రమే. పరిస్థితులు చాలాదూరంపోయినవనీ, రజాకార్లను అణిచివేసి, శాంతిరక్షకు తెలివి వచ్చేట్లు చేసేవరకూ పరిష్కారం అసంభవమనీ, నేను ఎంతో చెపుతున్నప్పటికీ, ప్రధాని మాత్రం పరిస్థితులు ఆశాజనకంగా వున్నవనే అన్నాడు. ప్రధాని పరిష్కారానికి ప్రభుత్వపు షరతులను నాకు తెలియచేయటంమాట అటుంచి, అటువంటి షరతులు ఉన్నవనికూడా సూచించలేదు. అంతరంగికసమస్యలను, వైదేశిక సమస్యలనూ పరిష్కరించటానికి అఖిలపక్ష ప్రభుత్వం ఏర్పాటుచేయాలని కానీ, మరే ఇతరమార్గాన్ని కానీ, ఆయన సూచించనేలేదు అసలు, ఒకపరిష్కారమార్గమంటూ ప్రభుత్వానికి లేనప్పుడు నాతో ఏమని ఆయన ప్రతిపాదిస్తాడు?

బాధ్యతాయుత ప్రభుత్వ విషయంలోనూ, ఇండియన్ యూనియన్‌లో చేరే విషయంలోనూ, ఉభయపక్షాలకూ చాలావరకు ఏకాభిప్రాయం కుదిరిందనీ, పరిస్థితులను గమనించ కలిగినవారి సద్భావం మీద ఆధారపడి తానొక పరిష్కార ప్రయత్నం చేయబోతున్నానని ఆయన అన్నాడు. కాంగ్రెసును సంబంధించినంత

(2-వ పేజీ చూడుడు)

## విచారణ సంఘము సరిహద్దు కమిషను అనవసరం

### ఆంధ్రరాష్ట్రనిర్మాణమువిషయమైడా॥ ముఖర్జీప్రకటన

బెజవాడ, మార్చి 25: యావద్భారత భాషాప్రయుక్తరాష్ట్ర సమితి అధ్యక్షుడును, లక్నో విశ్వవిద్యాలయ చరిత్ర పండితుడునుఅగు డా॥ రాధాకుముదముఖర్జీ గారు గతరాత్రి పత్రికా ప్రతినిధుల సభలో ప్రసంగించుచు రాష్ట్రములను శాస్త్రీయ పద్ధతిలో, అవి ప్రజాతీయముగా నుండునటు, ఇప్పటికంటె సమాజముగాను హేతుబద్ధముగాను వుండునట్లు నిర్మింపవలెననిరి. ఇండియా ప్రభుత్వమువారు ఈ సిద్ధాంతమును అంగీకరించినందులకు ప్రొ॥ ముఖర్జీ గారు సంతసము వెలిబుచ్చిరి. ప్రత్యేకముగా ఆంధ్రరాష్ట్రము విషయమై ప్రస్తావించుచు, దానిని జరూరుగా స్థాపించవలసిన అవశ్యకతను, దానికి తొలి ప్రాధాన్యమొసంగవలసిన అవశ్యకతను కేంద్ర ప్రభుత్వము సూత్రంగా అంగీకరించినందులకు ప్రొ॥ ముఖర్జీ గారు సంతృప్తి వెల్లడించిరి. ఇనప్పటికీ ఈ సందర్భమున ఎట్టి విచారణ సంఘము, బౌండరీ కమిషనుగూడ అవసరములేదనిరి. తమిళ, ఆంధ్రరాష్ట్రముల సరిహద్దుల విషయమై సందేహంగాని, తగాదాగాని లేదనిరి. బహుశః ఒక్క మద్రాసు విషయమున మాత్రము తగాదా యుండవచ్చుననిరి. ఈ స్థానిక తగాదాలను తమిళ ఆంధ్రదేశముల ప్రతినిధులు ముందుగానే పరిష్కరించుకొనవచ్చునని వాని పరిష్కారమునకు యూనియను ఒక సంస్థ నేర్పరుపవలెనని కోర నవసరములేదనిరి. చిరకాలమునుండి తాము కోరుచుండిన కోర్కె అతి త్వరలో నెరవేరుటకుగాను ఆంధ్రులు తమ రాష్ట్రనిర్మాణము విషయమై అధికారులకు మాటిమాటికి, వారి దృష్టి నాకర్షించు విధమున తెలుపుచుండవలెనని ప్రొ॥ ముఖర్జీ గారనిరి.

## జమ్నాదాస్ మెహతా విడుదల ఉత్తర్వు

### హెబియస్ కార్పస్ దరఖాస్తుపై హైకోర్టు ఉత్తర్వు

బొంబై, మార్చి 25: జమ్నాదాస్ మెహతాగారిని తక్షణమే విడుదలచేయవలసిందని బొంబై హైకోర్టు ఉత్తర్వు చెప్పింది. హెబియస్ కార్పస్ దరఖాస్తుపై విచారణజరిపి హైకోర్టు మెహతాగారి నిర్బంధము అక్రమమైనదని నిర్ణయించి పై ఉత్తర్వు జారీచేసినది. ప్రజా శాంతి రక్షణ నిబంధనలక్రింద మెహతాగారిని పోలీసులు 2 సార్లు అరెస్టుచేశారనే విషయం పాఠకులకు జ్ఞాపకం వుండవచ్చు.

## ఫ్రాన్సులో జెక్ రాయబారి రాజీనామా

పారిస్, మార్చి 24: ఫ్రాన్సులో జెకోస్లొవేకియా రాయబారిగావున్న యిండ్రిక్ నోసెక్, తనదేశంలో జరిగిన రాజకీయ పరిణామాలను బట్టి రాజీనామా పెడుతున్నానని ఈవేళ ఫ్రెంచి ప్రభుత్వానికి తెలియజేశాడు. (ఎ. యు. పి.)

## రెనివిల్లీ ఒడంబడికకు విరుద్ధంగా డచ్చి ప్రవర్తన

### భద్రతామండలికి ఇండొనీషియన్ రిపబ్లిక్ ఆక్షేపణ

లేక్‌సక్సెస్, మార్చి 24: డచ్చి యాజమాన్యాన, మార్చి 15 వ తేదీన తూర్పు సుమత్రా ప్రభుత్వం నెలకొల్పబడడం, ఐక్యరాజ్యసమితి సామరస్యసాధన సంఘం కుదిర్చిన రెనివిల్లీ ఒడంబడిక షరతులకు విరుద్ధం" అని ఇండొనీషియా రిపబ్లిక్ ప్రభుత్వం భద్రతామండలికి ఫిర్యాదు చేసింది.

ఇండొనీషియారిపబ్లిక్ తరఫున శాశ్వత ప్రతినిధి మండలికి పంపిన లేఖలో యిలా ఉన్నది. "డచ్చి ప్రభుత్వం చేసిన యీ పనికి నా ప్రభుత్వం ఆక్షేపణ తెలుపుతున్నది. పడమటి జావా, మధురా దీవులకు సంబంధించి, సమితి సామరస్యసాధనా సంఘం పంపిన నివేదికను పరిశీలించడానికి ఉపక్రమించినప్పుడు భద్రతామండలి చర్చకు యీ విషయాన్ని ప్రతిపాదించాలని నా ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది.

ఇండొనీషియా రిపబ్లికుతో వాణిజ్యాన్ని పునరుద్ధరించుకొనే విషయంలో డచ్చి ప్రభుత్వం ప్రదర్శిస్తున్న వైఖరి, యుద్ధ విరమణ ఒడంబడిక షరతులకు భిన్నంగా ఉన్నదని, రిపబ్లిక్ వర్గాలవారు అభిప్రాయ పడుతున్నారు.

ముందేర్పడనున్న సంయుక్త ఇండొనీషియా భవిష్యత్ ఆర్థిక వ్యవహారాల నిర్వహణకు సంబంధించి ఒడంబడిక కుదిరేటంతవరకూ, రిపబ్లిక్‌తో వాణిజ్యాన్ని పునరుద్ధరణను గురించి చర్చించ దలచుకోలేదని డచ్చి అధికారులు, నిన్న ఆర్థిక సంఘ సమావేశంలో వెల్లడించారు. ఈ సంఘ సమావేశాన్ని ఐక్యరాజ్య సమితి సామరస్య సాధన సంఘంవారు యేర్పాటు చేశారు.

## పంచమాంగదళాల నిర్మూలన

### ఢక్కా విద్యార్థులకు జిన్నా ఉద్బోధ

ఢక్కా, మార్చి 24: పాకిస్తాన్ గవర్నర్ జనరల్ మహమ్మదాలీ జిన్నా నేడు ఢక్కా విశ్వ విద్యాలయంలో స్నాతకోపన్యాసం చేస్తూ నూతన పట్టభద్రులను ఉద్దేశించి ఇలా అన్నాడు:—"మీరు మీ పూర్వీకుల కన్న అనేక విషయాలలో ఎన్నోరెట్లు అదృష్టవంతులు. మీ రిప్పుడు సంపూర్ణ స్వతంత్రమైన స్వరాజ్యంలో జీవితం ఆరంభించ బోతున్నారు. విప్లవాత్మకమైన ఏ మహా పరిణామాలవల్ల మనం పాకిస్తాన్ను సాధించగలిగిందీ, మీరూ మీ తోటి విద్యార్థులూ కూలంకషంగా అధ్యయనం చేసుకోవాలని నేను కోరుతున్నాను. మనం ఇప్పుడు ఇంతకాలము మనలను బంధించి ఉన్న దాస్య శృంఖలను ఛేదించి సర్వ స్వతంత్రులమైనాము. మనం, స్వరాజ్యమూ, ప్రజల యోగక్షేమాల కై పాటుపడే స్వకీయ ప్రభుత్వమూ సాధించుకున్నాము.

కాని స్వాతంత్ర్యం విశృంఖలత కాదు. ఇతర ప్రజలయొక్కయూ, దేశముయొక్కయూ యోగక్షేమాలు ఏమైనప్పటికీ లెక్కచేయకుండా యథేష్టంగా ఎవరికి తోచినట్లు వారు ప్రవర్తించడం స్వాతంత్ర్యంకాదు. స్వాతంత్ర్యం వచ్చినందువల్ల మీమీద ఇప్పుడు వెనకటికంటె ఎక్కువిధులు ఎక్కువ బాధ్యతలు పడినవి. మనం అందరమూ సంఘీభవించి క్రమ

(2-వ పేజీ చూడుడు)

